# మహేంద్రజాలం

"ఉషాపద్మశ్రీ"



( శ్రీ విద్యా జ్యోతిష కేంద్రమ్ )
D. No. 22-7-10, స్టేట్ బ్యాంక్ రోడ్,
తెనాలి - 522 201.







జనప్రియ పబ్లికేషన్స్
అగ్నికులక్షత్రియులవారివీధి-II, గంగానమ్మపేట, తెనాలి-1.

# MAHENDRA JAALAM

**By : USHA PADMASREE**


| | |
|---|---|
| ముద్రణ :<br>అక్టోబర్, 1993. | Edition :<br>OCTOBER, 1993. |
| అన్ని హక్కులు :<br>జనప్రియ పబ్లికేషన్స్,<br>తెనాలి-వారివి. | All rights reserved by :<br>*Janapriya Publications,*<br>TENALI-522 201. |
| వెల :<br>రు. 6-00. | Price :<br>**Rs. 6-00.** |
| ముఖచిత్రం :<br>వి. ఎస్. ప్రకాష్,<br>విజయవాడ-3. | Cover Design :<br>V. S. PRAKASH,<br>Vijayawada-3. |
| ముద్రణ :<br>కె. ఎస్. ఆర్. ప్రింటర్స్,<br>తెనాలి-1. | Printed at :<br>K. S. R. Printers,<br>Tenali-1. |
| ముఖచిత్ర ముద్రణ :<br>శ్రీదేవి ప్రింటర్స్,<br>విజయవాడ-520 001. | Wrapper Printer :<br>*Sri Devi Printers,*<br>Vijayawada-520 001. |

ప్రతులకు : For Copies :

**Janapriya Publications,**

Agnikula Kshatriyula vari Street-II,

*Ganganamma pet,* TENALI-522 201.

# విషయసూచిక

విషయము : పేజి

విషయము : పేజి

XXXXX

# మా మాట

ఇంతవరకు మేము ప్రచురించిన వివిధ వైవిధ్యము గల గ్రంథములను సమాదరించిన అశేష పాఠక మిత్రులకు మా హృదయపూర్వక నమస్సుమాంజలులు !

మేము ఇంతకుపూర్వము ప్రచురించిన "ఇంద్రజాల రహస్యాలు" అను గ్రంథమును విశేషంగా ఆదరించిన అఖిలాంధ్ర పాఠక మహాశయుల ప్రోత్సాహమే- ఈ గ్రంథ ప్రచురణకు "నాంది" అయినది.

ఇందులో- వినోదానికి అత్యంత ప్రాధాన్యత నిచ్చే- ఆధునిక ప్రదర్శనలేగాక- మూలికలు, రసాయనాల కల యికచే ఉద్భవించు చిత్ర-విచిత్ర పురాతన పద్ధతులను కూడా చేర్చడము జరిగినది.

ఈ ప్రదర్శనలు చేయువారు సాంకేతిక ఇబ్బందులను తమ తమ అనుభవములతో గ్రహించి,సందర్భానుసారముగా ఏ ప్రదేశములలో- ఏ సమయములో- ఏ ప్రదర్శన చేయ వచ్చునో నిర్ణయించుకొనగలవారై యుండవలెను.

ఈ గ్రంథ ప్రచురణలో తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించిన- "వి.జి. చౌదరి (V.G. పబ్లికేషన్స్- అధినేత)" గారికి...!

ఈ చిన్న హొత్తమును సర్వజనాదరణీయముగా మల చిన రచయిత "ఉషా పద్మశ్రీ" గారికీ...! మే మందించు వినోద విజ్ఞాన సాహిత్యానికి తమ వంతు ప్రోత్సాహా న్నిస్తున్న "తెలుగు పాఠక మహాశయుల"కూ- మాకృతజ్ఞత లను తెలియజేస్తూ- సెలవు తీసికొనే... మీ...............

— ప్రకాశకులు

డా॥ A. ప్రభాకరబాబు M.B.B.S.,F.C.I.P. గారి రచనలు

# సెక్స్ ఎడ్యుకేషన్

'ఆదర్శ లైంగిక జీవితం' అంటే....ఏమిటి? ఆరోగ్యంగా జీవించడానికి- 'సెక్స్' అవసరమా?? యౌవన ప్రారంభంలో జరిగే- వివిధ మార్పులు; లైంగిక శక్తి- వీర్యవృద్ధి; సంతానహీనత వంటి.... సెక్స్ విషయాలను- సమగ్రంగా చర్చించిన.... "లైంగిక విద్యాదర్శిని!"

వెల : Rs. 15-00

---

డా॥ K.V.N.D. ప్రసాద్ D.H.M.S., M.H.S. (London)

# సెక్స్ & హోమియో

లైంగిక సమస్యలపట్ల- విశేష కృషి చేసిన....ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తల- "పరిశోధన"ల ననుసరించి....విషయ "విశ్లేషణ"లు- మరియు వివిధ మానసిక, శారీరక సెక్స్ సమస్యలకు- "హోమియో చికిత్సలు!"

వెల : Rs. 18-00

---

ప్రతులకు :- "జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-522 201"కి సదరు పైకం M.O. చేయగలరు !

# మహేంద్రజాలం

## (ఇంద్రజాల రహస్యాలు)

### పాముని పడగ విప్పకుండా చేయుట

1. ఎలాంటి భయంకరమైన (లేక, దేవతా) సర్పమైన పెద్దఉల్లిపాయ (వెల్లుల్లి)ను నూరి వాసన చూపినా, మధ్యకు కోసి వాసన చూపినా- పాము పడగ విప్పకుండా ముడుచుకు పోతుంది. లేకపోతే పారిపోతుంది.

2. పై విధంగానే తెల్ల ఈశ్వరీ వేరును తెచ్చి, గంధము తీసి, సర్పమునకు వాసనచూపినా పడగ విప్పలేదు.

ఈ ప్రదర్శన చేయువారు ఈ రెంటిలో దేనినైననూ ఆచరించవచ్చును. ఈ ప్రదర్శనకు పాము స్వంతమైనదే కానక్కరలేదు. అప్పటికప్పుడు ఎవరైనా పామును తెచ్చి- పడగవిప్పకుండా చేయమన్ననూ నిరభ్యంతరముగా పై విధానంతో పాము పడగ విప్పకుండా చేయవచ్చును.

### నిద్రపుచ్చుట

ఇంద్రజాలికుడు ప్రేక్షకులతో- నిద్రపోనని భీష్మించుకొని వున్న వారిని సైతం నా మహిమతో నిద్రపుచ్చుతానని చెప్పి- వచ్చిన వ్యక్తిని నిద్ర పుచ్చి- అందరిని ఆశ్చర్యపరుచవచ్చును.

ఆ రహస్యం ఏమిటంటే ? విషముష్టి అనే చెట్టు వేరును తెచ్చి, దాని నూనెను తీసి- ఆ నూనెను కుంకుమలోనో,

విభూదిలోనో, సిందూరంలోనో కలిపి జాగ్రత్తగా భద్రపరచుకొని, ప్రదర్శన సమయంలో- దానిని వచ్చిన వ్యక్తికి బొట్టు పెట్టి- "తదేకంగా నా కళ్ళలోకి చూడు" అనో లేక ఏదయినా వస్తువునుగాని, చిత్రములనుగాని చూడమనో చెప్పి- తను ధ్యానం చేసినట్లుగా కొంచెంసేపు నటిస్తే- ఈ లోపులో మూలిక పనిచేసి ఆతను సుఖనిద్రలోకి జారిపోతాడు.

## నూనెను పాలుగా మార్చుట

ప్రదర్శకుడు ప్రేక్షకులతో ఎలాంటి వంట నూనెనైనా పాలుగా మారుస్తానని చెప్పి- అనుమానం లేకుండా నూనె వారినే తెమ్మని చెప్పాలి. వారు నూనె తేగానే- తన దగ్గర సిద్ధంగా ఉన్న క్షారాన్ని చాకచక్యంగా ఆ నూనెలో కలిపిన వెంటనే పాలుగా మారిపోవును. ఈ ప్రదర్శన చాలవింతగా వుండును.

ఇది ప్రదర్శించువారు ముందుగా ఉత్తరేణి ప్రేళ్ళను తెచ్చి, బాగా కాల్చి, తెల్లగా పొడిచేయాలి. ఆ పొడిని నీటిలో వేసి బాగా కలపాలి. ఆతరువాత కదలకుండా తేరుకోనివ్వాలి. మరురోజు కొంత పొడివేసి బాగా కలపాలి. తిరిగి కదలకుండా తేరుకోనివ్వాలి. ఇలా 7-8 రోజులు చేసినచో క్షారము తయారవుతుంది. దీనిని సీసాలో భద్రపరచుకొని ప్రదర్శన సమయములో ఉపయోగించాలి.

వండకుండా (మంట పెట్టకుండా)అన్నం తయారీ

ప్రదర్శకుడు తన దగ్గర సిద్ధంగా వున్న బియ్యాన్ని చూపి- నా మంత్ర మహిమతో ఈ బియ్యాన్ని మంట(పొయ్యి) లేకుండానే ఉడికిస్తానని చెప్పి– ఆ బియ్యాన్ని ఒక పాత్రలో పోసి, మంత్రిస్తూ (నటిస్తూ) నీరు పోసిన వెంటనే ఆ బియ్యం కుతకుతా ఉడికి అన్నం తయారవుతుంది. ఇది చూచినవారికి ఎంతో అద్భుతంగా వుంటుంది.

ఈ ప్రదర్శనకు ముందుగా తగినన్ని బియ్యాన్ని దెచ్చి వాటిని సున్నంబట్టిలో గొయ్యి తీసి పాతిపెట్టాలి. తరువాత సున్నంబట్టి చల్లారిపోతుంది. అప్పుడు బియ్యాన్ని తీసి భద్ర పరచుకొని ప్రదర్శన సమయంలో పైన చెప్పిన విధంగా చేసినచో అన్నం తయారవుతుంది. ఈ విధంగా బియ్యమే గాకుండా జొన్నలు, తైదులు, సజ్జలు, గోధుమలు మొ॥గు ఆహారపదార్థములకు పనికివచ్చు ఏ గింజలనయినా ప్రయో గానికి వినియోగించవచ్చు.

టెంకాయ బాంబులా ప్రేలుట

ప్రదర్శకుడు ఒక టెంకాయను చూపి- నాశక్తితో దీన్ని బాంబులాగా ప్రేల్చివేస్తానని చెప్పి కొంతసేపు ధ్యానంలో వుండి మంత్రించి (నటించి) కొబ్బరికాయ మీద నీరుపోయు వలెను. వెంటనే ఆ టెంకాయ బాంబువలే ప్రేలిపోగలదు. ఈ ప్రదర్శన తిలకించినవారు భయ-భ్రాంతులై ఆనందపడగలరు.

ఈ ప్రదర్శనకు ముందుగా పీచువలవని పచ్చికొబ్బరి కాయను కొత్తసున్నం నీటిలో 10-15 రోజులు నానబెట్టాలి. నానబెట్టే సమయంలో రోజూ కొత్తసున్నం వేస్తూ వుండాలి. తరువాత ఆ కొబ్బరికాయను ఎండించి, భద్రపరచుకొని, ప్రదర్శన సమయంలో వినియోగించాలి.

## నీళ్ళతో పేలాలు

ఇంద్రజాలికుడు ప్రేక్షకులతో మీరందరూ పొయ్యి మీద భాండీపెట్టి, మంటచేసి పేలాలు తయారు చేస్తారు. కాని నేను మాత్రం నా మహిమతో నిప్పు-పొయ్యి లేకుండా నీళ్ళతో మాత్రమే పేలాలు తయారు చేస్తానని చెప్పి- వడ్లు, గోధుమలు ఏవైనా సరే సిద్ధంగా వుంచినవి తీసుకొని వాటిపై మంత్రజలం (మంత్రజలంలా నమ్మించి) చల్లగానే అవి పేలాలుగా మారి సభికులను ఆశ్చర్యచకితులను చేసివేస్తాయి.

ముందుగా పొట్టువలవని ధాన్యం (వడ్లు, జొన్నలు, గోధుమలు మొ॥నవి) తీసుకొని సున్నంబట్టీలో గుంట తీసి పాతి పెట్టాలి. సున్నంబట్టీ చల్లారిన తరువాత వాటిని తెచ్చి భద్రపరచుకొని ప్రదర్శన సమయంలో ఉపయోగించాలి.

## క్షణంలో బ్రాంది

వేడివేడి నీళ్ళలో ఇప్పపూలు మంచివి- పదిపూలు వేసి నా మహిమతో ఇప్పపూలు బ్రాందీగా తయారు అవుతాయి అని చెప్పాలి. కొద్దిసేపు తరువాత పూలు తీసివేసి ఆ నీరు ప్రేకులకు పోస్తే అవి త్రాగగనే బ్రాందిలాగా వుండి వారు చాలా అబ్బురపడతారు.

ప్రదర్శకుడు ముందుగా ఖాళీ మందుగొట్టాలు (మెడికల్ షాపులలో దొరుకును) తీసుకొని వాటి నిండా బ్రాంది పోసి మూతలు బిగించి వుంచుకోవాలి. తదుపరి ప్రదర్శనలో అలా బ్రాందిపోసిన గొట్టము నొకదాన్ని నేర్పుగా చేతివ్రేళ్ళ సందులలో ఇరికించుకొని- పూలు వేయునప్పుడో లేక పూలు తీయునప్పుడో, కలుపునప్పుడో ఆ గొట్టాన్ని దానిలో జారవిడిచిన ఆ గొట్టాము వేడి నీటిలో కరగిపోయి, దానిలోని బ్రాంది నీటిలో కలిసి ఆ నీరంతా బ్రాందీ రుచిని సంతరించుకొంటుంది. ఇలాగే విస్కీ, రమ్ము, సారాలను కూడా సమయానుకూలంగా వినియోగించవచ్చును.

## పాలలో ఎన్ని నీళ్ళు

ఇంద్రజాలికుడు సభికులతో మీలో ఎవరయినా పాలు తీసుకురండి! ఆ పాలలోఉన్న నీటిని తీసి మీకు చూపిస్తానని చెప్పి, వారు పాలు తీసుకురాగానే ఆ పాలలో మహిమ (బూటకపు) గల విభూదిని వేసి పొయ్యిమీద వేడి చేయగానే పాలు ఆవిరి అయిపోయి, పాలలోవుండే నీరు మాత్రమే మిగిలిపోయి, చూచువారు మిక్కిలి ఆనందపడతారు.

ఈ ప్రదర్శనకు ముందుగా తామర గింజలను తెచ్చి ఎండపెట్టి పొడిగా (మెత్తగా) చేసి వుంచుకొని ప్రదర్శన సమయంలో దానిని విభూదిలా పాలలో వేసిన పాలలో నీరు మాత్రమే మిగులుతుంది.

## బంగారాన్ని రాగిగా మార్చుట

నా మంత్రశక్తి మహిమతో బంగారాన్ని రాగి లాగా మార్చివేస్తానని చెప్పి, ప్రేక్షకులలో ఎవరి దగ్గరయినా బంగారు వస్తువును తీసుకొనిదానిపైన తనదగ్గరనున్న శక్తివంతమయిన పచ్చకర్పూరపు పొడిని బాగా రుద్దాలి. అప్పుడు బంగారం రాగిగా మారి ఎంతో ఆశ్చర్యపరుస్తుంది.

ఈ ప్రక్రియను చేసే ముందు ప్రదర్శకుడు ఏమి కష్ట పడవలసిన పనిలేదు ! కారణం ఏమిటంటే ? పచ్చకర్పూరం తగులగానే బంగారము రాగిరంగులోకి సహజంగా మారి పోతుంది గాబట్టి ! ఈ క్రియ చాలా మందికి తెలియదు. రాగిగా మారిన బంగారాన్ని మంచినీటితో కడిగితే తిరిగి మామూలుగా బంగారం అవుతుంది.

## రాగిని బంగారంగా మార్చుట

మణిసిల, గంధకము, ఊడుగరసం, తంగేడు, జమ్మి, తాళకములను కలిపి మెత్తగా నూరి, పౌడర్‌గా చేసి వుంచు కొని ప్రదర్శన సమయంలో తెలివిగా మాటలు చెపుతూ పై పౌడరును సున్నితంగా ఒక రాగి ముక్కకు పట్టించిన (పూయటం)ఆ రాగి బంగారంలా ధగ ధగా మెరిసిపోతూ... చూచువారికి దిగ్భ్రాంతిని కలిగిస్తుంది.

## నిమిషములో పాలు పెరుగుగా మారుట

ప్రేక్షకులను పాలు తెమ్మని చెప్పి- నా మహిమతో ఈ పాలను వెంటనే పెరుగుగాచేస్తానని;తను ముందుగా సిద్ధం

చేసుకొన్న పెన్నేరుగడ్డ పొడిని కొంచెంవేసి బాగా తిప్ప గానే ఆపాలు చిక్కగా గడ్డ కడతాయి. అప్పుడు దానిలో "లాక్టిక్ యాసిడ్" ఒక చుక్కవేస్తే చక్కని గడ్డ పెరుగు తయారవుతుంది.

## శరీరం అగ్నిజ్వాలల్లో కాలదు

ఉప్పిచెట్ల మధ్యలో ఉన్న పుట్టమట్టి, ఉరుములు-మెరుపుల కాలంలో పుట్టుకొచ్చే పుట్టగొడుగులు (పుట్ట కొక్కులు) కలిపి ఒక క్రొత్త కుండలో వేసి గట్టిగా మూత పెట్టి వుంచాలి. కొంతకాలానికి ఒక విధమైన తైలము వాటి నుండి వస్తుంది. దాన్ని ఒక సీసాలో భద్రపరచి ప్రదర్శన సమయంలో ఒంటికి పూసుకొని, మంటలలో ప్రవేశించినా శరీరం కాలదు. ఇది చూసినవారు చాలా ఆశ్చర్యపడతారు

## బాధాకరమైన పంటినొప్పి చిటికెలో మాయం

తగినన్ని మోదుగుమాడలు తెచ్చి బాగా ఎండబెట్టి, ఇనుప మూకుడులో (భాండీలో) వేసి బాగా వేయించి, మెత్తగా చూర్ణంచేసి, పలుచని గుడ్డలో వేసి గాలించిన. పౌడర్‌ను ప్రదర్శన సమయంలో మహిమ గల్గిన విభూదిగా చెప్పి, చిటికెడు పౌడర్ పంటినొప్పి వున్న చిగురుకు పట్టించిన- క్షణంలో నొప్పి మాయమవుతుంది. ఈ పొడి నాలుక మీద వేసిన చురుక్కుమని మంటపుట్టును.

## ఎంతవుంటతో కాల్చినా కాగితం కాలదు

న్యూస్ ప్రింట్ కాగితం లేక బాట్లింగ్ పేపరును సేక రించాలి. పటికను పొడిగొట్టి, నీటిలో చిక్కగా కలిపి ఆ కాగి తాన్ని తడిపి (5-20 సార్లు) ఎండబెట్టి దగ్గర వుంచుకో వాలి. ప్రేక్షకులెవరినయినా పిలిచి ఆ కాగితాన్ని తగల పెట్టమని చెప్పాలి. వారు ఆ కాగితాన్ని ఎంత కాల్చినా మండదు. ఈ ప్రదర్శన చాల అద్భుతంగా వుంటుంది.

## పాలు-పంచదార-టీపొడి లేకుండా "టీ"

బాగా కండ కలిగిన మంచి ఉసిరికాయలు- ఆవుపాల (లేక గేదెపాలు) లో వేసి బాగా ఉడికించాలి. ఆ తరువాత ఎండబెట్టి మెత్తగా చూర్ణంచేసి దానిలో టీ పొడి, సువాస నకు ఏలకులపొడి వేసి మరల బాగా నూరి పొడిచేసి కొంచెం చాక్రిన్‌గాని, గ్లూకోజ్ గాని కలిపి వుంచుకోని- ప్రదర్శన సమయంలో స్టౌమీద వేడినీళ్ళు మరగించి- దానిలో ఈ పొడిని (మంత్రభస్మంగా భ్రమింపజేసి) వేసిన చక్కని "టీ" తయారవుతుంది. ఇది చూచువారికి చాలా విచిత్రంగా వుంటుంది.

## నాణెమునకు చుట్టిన దారమును ఎంత మంట పెట్టినా కాలదు

నాణెమునకు దారం గట్టిగా కట్టి వ్రేలాడదీయాలి. తరువాత ప్రేక్షకులను పిలిచి నా మంత్రమహిమతో- మీరు నాణెమును కాల్చినా వ్రేలాడే దారం తప్ప, నాణెమునకు

చుట్టూ ఉన్న దారము మాత్రము కాలదు." అని చెప్పాలి! వారు వ్రేలాడే దారానికి తగలకుండా నాణెము చుట్టూ ఉన్న దారాన్ని 20-30 అగ్గిపుల్లలతో కాల్చినా ఆ దారం కాలదు. ఈ ప్రక్రియ చాలా వింతగా వుంటుంది.

## చిటికెలో సంకెళ్ళు ఊడిపోవుట

ప్రదర్శకుడు, ప్రేక్షకులతో- మీలో ఎవరయినా సరే ఎంత బలమయిన సంకెళ్ళు నాకు వేసినా క్షణంలో వాటిని- విడిపించుకొంటానని చెప్పాలి. వారు ఎటువంటి సంకెళ్ళు వేసినా క్షణంలో ఊడదీసుకొని అందరిని ఆశ్చర్యపరచవచ్చు.

ఈ ప్రదర్శనకు ముందుగా పెద్దమందాకుపాలు, జువ్వి పాలు, జెముడుపాలు, మర్రిపాలు, జిల్లేడుపాలు, మేడిపాలు సమపాళ్ళలో తెచ్చి, అన్నీ, కలిపి, ఒక తెల్లని గుడ్డ(జేబురుమాలు)- ఆ పాలలో- ముంచి, ఆరబెట్టి, ముంచిఆరబెట్టి- ఇలా 5-6 సార్లు చేసి- ఆ గుడ్డను జాగ్రత్త చేసుకొని ప్రదర్శన సమయంలో దానిని మంత్రించి (అలా నటించి), సంకెళ్ళు తొడిగిన చేతి పైన వేసినచో సంకెళ్ళు వెంటనే వూడిపోతాయి.

(ప్రస్తుతకాలంలో ఇది చాలా కష్టసాధ్యం)

## నీళ్ళతో నెయ్యి తయార్

ప్రదర్శకుడు సభికులతో- నెయ్యి ఈరోజులలో కిలో 80 రూపాయలదాకా వుంది. నేను నీటితో నెయ్యి చౌకగా తయారు చేస్తానని చెప్పి- తనవద్ద సిద్ధంగా వుంచుకొన్న "సజ్జాగింజల" పొడిని తగుమాత్రం నీటిలో వేసి బాగా త్రిప్పాలి.

వెంటనే నెయ్యి (నెయ్యిలా వుండే పదార్థము) తయారయి చూచువారికి చాలా సంతోషం కలుగుతుంది.

## మంటువాయుం - క్షణాలలో చెవుడు!

ప్రదర్శకుడు ప్రేక్షకులతో— మీలో ఎవరయినా విని పించని వారుంటే వారికి క్షణాలలో చెవుడు పోగడతానని చెప్పి, తనదగ్గర సిద్ధంగా వుంచుకొన్న నూనెను మంత్రించి (అట్లు నటించి) చెవిలో వేసినచో చెవుడు తగ్గిపోయి- వారు పరమానందం పొందుతారు.

ప్రదర్శకుడు ముందుగా ఏడాకుల పొన్న [బూరుగు చెట్టుఆకులా వుంటుంది] ఆకులను- కాటన్ ఆయిల్ [ప్రత్తి గింజల నూనె]ల్లో, వేసి, బాగా కాచి ఆరిన తరువాత పలుచని తెల్లగుడ్డలో, వడగట్టి, ఆ నూనెను సీసాలో జాగ్రత్తగా దాచి, ప్రదర్శన సమయంలో వినియోగించవలెను.

## అగ్గిపెట్టె తనంతటు తానే మండిపోవుట

నా మంత్రబలముతో అగ్గిపెట్టె-పుల్లలు వాటిఅ ంతట అవే కాలిపోయేటట్లు చేస్తాను. మీలో ఒకరు అగ్గిపెట్టె ఇవ్వ వలెను. అని చెప్పి అగ్గిపెట్టె తెచ్చిన తరువాత తన దగ్గర సిద్ధంగా వున్న "సల్ఫ్యూరిక్ యాసిడ్" నుమంత్రించినసీరుగా భ్రమింపజేసి, చేతితో తాకకుండా ఆ యాసిడ్‌ను అగ్గిపుల్లల మందుపైన వేయగానే అదిభగ్గున మండిపోయి- చూచువారికి ఎంతో ఉల్లాసాన్ని కలిగించును.

## బొమ్మ కప్పకు ప్రాణప్రతిష్ఠ

ప్రదర్శకుడు— తనవద్ద సిద్ధంగా వుంచుకొన్న కప్ప బొమ్మనుచూపి, "దీనికి నా మంత్రబలముతో ప్రాణంపోస్తాను" చూడమని చెప్పి కొంచెంసేపు ధ్యానించి [అలా నటించి] ఆ బొమ్మను తీసుకొని, సాంబ్రాణి ధూపంవేసి, బొమ్మను క్రింద పెట్టగానే దానికి ప్రాణం వచ్చి ఎగిరెగిరి పడుతుంది. ఈ వింత చూచిన ప్రేక్షకులు ఎంతో ఉద్వేగం జెందుతారు.

ఈ ప్రదర్శనకి ముందుగా- చిన్న ఇనుప గోలిగాని, పెట్టెలాంటిదిగాని [తామెత్తు అయినా ఫరవాలేదు] తీసుకొని, దానిని పాదరసంతో నింపి- మైనంతోగాని, లక్కతోగాని మూతిమూసివేసి దానిని బొమ్మకప్పకు క్రింది భాగంలో దారంతో కనిపించకుండా కట్టాలి. [మైనంతోగాని, లక్కతో గాని, అంటించచ్చు.] ధూపం వేసేటప్పుడు బాగా వేడి తగిలేటట్లుగా- కాస్సేపు వుంచి క్రింద, పెడితే- లోపలిపాదరసం వేడికి వ్యాకోచించి కదులుతుంది. ఆ కదిలే సమయంలో కప్ప కూడా ఎగిరెగిరి పడుతుంది. అది వేడి వున్నంతవరకే ఇలా ఎగురుతుంది.

## ఈగలు పారిపోవుట

ఈగలు మెండుగావుండే [జూన్, జూలై] సమయాల్లో మాత్రమే ఈ ప్రదర్శన బాగా రక్తి కడుతుంది. ఈగలను చూచి ప్రదర్శకుడు చిరాకుతో "ఈ మహా మాంత్రికుడంటే ఈగలకు సరిగా తెలియదు. చూడు మిమ్ములను ఏం చేస్తానో" అని తన దగ్గర అంతకుముందే సిద్ధంగా వున్న "తాళకము"

యొక్క పొడిని [సాంబ్రాణిలో కలిపి వుంచుకోవాలి] నిప్పులపై విసరికొట్టి మంత్రధ్యానం [నటన]లో మునిగిపోవాలి. అలా కొంచెంసేపు వుండి కనులు తెరచి, చూసేసరికి ఒక్క ఈగకూడా లేకుండా పోతుంది. అది చూచిన వారు ఇతని శక్తికి చాలా ఆశ్చర్యపడతారు.

## ఊస్తే ఉమ్మి - మంటలు భగ్గున!

ప్రదర్శకుడు సభికులతో "నేను గొప్ప మహిమాన్వితుడను. ఎంత గొప్పవాడినంటే నేను ఉమ్మి ఊసినా సరే భగ్గున మంటలు పుడతాయి. చూడండి నా మహాశక్తిని!" అని చెప్పి గడ్డిమీదో లేక కర్పూరము మీదో, గుడ్డమీదో సమయానుకూలంగా ఊసిన వెంటనే ఉమ్మిపడిన ప్రాంతంలో ఉన్న పదార్థాలు భగ్గున మండిపోతాయి. ఈ ప్రదర్శన తిలకించిన వారు ఊపిరి సలపనంత ఆశ్చర్యం పొందుతారు.

ఈ ప్రదర్శనకు ముందుగా ఇంద్రజాలికుడు గౌరీపాషాణము [వైట్ ఫాస్ఫరస్]ను ఆవగింజ పరిమాణం పుల్లతో తీసుకొని,నాలిక క్రిందగాని.దవడప్రక్కగాని పెట్టుకొని, సమయం వచ్చినప్పుడు ఉమ్మితోపాటు దానినికూడా లక్ష్యముపైన ఊయవలెను. తడి ఆరిన వెంటనే అది మండిపోయి పక్క పదార్థములను కూడా మండిస్తుంది. ఈ వైట్ ఫాస్ఫరస్‌ను ఎప్పుడూ నీళ్ళలోనే వుంచాలి. బయటకు తీయగానే ఆరిపోయి తనంతట తానే మండిపోయే గుణముగల దీనిని తెల్ల భాస్వరమని చాలామంది అంటారు.

## గాఢనిద్ర కల్పించుట

ఇంతకు ముందు నిద్రపుచ్చుట (సుఖనిద్ర) గురించి చెప్పుకున్నాము. ఇది అమితమైన గాఢనిద్రను కలిగించే ప్రక్రియ. ముందుగా గసగసాలను వేగీవేగకుండా, కచ్చా పచ్చిగా వేయించిన తరువాత గుడ్డలో వేసి, మూటగట్టుకొని వుంచాలి. సమయానుకూలమైన మాటలు చెపుతూ ఆ మూటను నిద్రకావలసినవారికి- బాగా (5-6 సార్లు) వాసన చూపాలి. ఇలా వాసన చూసినవారు 10-15 నిముషాల్లో బ్రహ్మాండమయిన గాఢనిద్రను పొందుతారు.

## నీళ్ళతో దీపాన్ని వెలిగించుట

ప్రదర్శకుడు తన పవిత్రమయిన మంత్రశక్తితో నీళ్ళతో గూడా దీపాన్ని వెలిగిస్తానని చెప్పి, తన దగ్గర సిద్ధంగా వున్న వత్తిని- నీళ్ళతో నింపిన ప్రమిదలో వేసి,వెలిగించగానే అద్భుతంగా ఆ దీపం! వెలుగుతుంది చూచువారికి ఇది ఎంతో వింతగా వుంటుంది.



ముందుగా వజ్రదుర్గంతోనూ, నూనెతోనూ దూదిని బాగా తడిపి, వత్తులు చేసుకొని, ఆరబెట్టి, జాగ్రత్త చేసుకొని, ప్రదర్శన సమయంలో- వీటిని ఉపయోగించి దీపాన్ని వెలిగించాలి.



## బూడిద పూస్తే సెంట్‌గా మారుట

నఖికులతో సందర్భానుసారంగా మాట్లాడుతూ- మీకు సెంటువాసనతో కూడిన బూడిదను ఇస్తానని చెప్పి- వారినే

ఏదయినా కాగితంగాని, గుడ్డగాని ఇవ్వమని అడిగి తీసుకొని తను స్టేజీమీద గుర్తుగా వుంచుకొన్న ప్రదేశంలో వారిచ్చిన కాగితాన్ని కాల్చి, ఆ బూడిదను వారికి పంచిన- ఆ బూడిదకు సెంటునువాసన వచ్చి వారికి మితిమీరిన ఆనందం కలిగి ఉత్తేజపడతారు.

1) ప్రదర్శించువారు ముందుగా స్టేజిమీద తనకు అనుకూలమయిన ప్రదేశములో సెంటునుపోసి ఆ ప్రదేశంలో వారిచ్చిన కాగితాన్ని కాల్చాలి.

2) లేదా- కాళీమందు గొట్టాము (ఎమ్టి మెడిసన్ క్యాప్సూల్) లోపల సెంటును నింపి- ప్రదర్శన సమయములో (కాగితాన్ని కాల్చునపుడు ఆ మంటలో చాకచక్యంగా ఆ గొట్టాన్ని వెయ్యవలెను) దాన్ని వినియోగించాలి.

## నీటిలో పన్నీటి సువాసనం

ప్రదర్శకుడు తనను చూచువారితో- తన దివ్యమయిన మంత్ర మహిమతో నీళ్ళను గూడా పన్నీరుగా మారుస్తానని చెప్పి- మంత్రించి (అలా నటించి) విభూతిని తీసి- పాత్రలో వున్న నీటిలో (పాత్రలోవున్న నీళ్ళను ప్రేక్షకుల చేతనే తెప్పించడము మంచిది.అలాగయిన వారికి అనుమానమురాదు) వేసి కలియబెట్టాలి. (కలియబెట్టడం- ఎంతో చాకచక్యముగా అనుమానము రాకుండా- జాగ్రత్తగా కలపాలి) ఇక ఆ నీరు పన్నీటి వాసనలతో విరాజిల్లి చూచువారు చాలా ముచ్చట పడతారు.

ప్రదర్శకుడు ముందుగా ఆ విభూతిలో "రోజ్‌ఎసెన్స్" కలిపి, జాగ్రత్తగా వుంచుకొని- ప్రదర్శనా సమయములో ఆ బూడిదను వాడాలి.

## మంత్రానికి అరటిపండ్లు

ప్రదర్శకుడు తన మంత్ర మహిమచే అరటిపళ్ళను సృజించి ఇస్తానని చెప్పి నేలమీద (స్టేజీపయిన) ఒక గుడ్డ పరచి, ఆ గుడ్డమీద తను సిద్ధంగా వుంచుకొన్న బుట్ట [వెదురు గంప]ను బోర్లించి- ఆ బుట్టను పూర్తిగా గుడ్డతో [లేక దుప్పటి, బట్ట నలుపు రంగుది వాడటం మంచిది] కప్పాలి. ఆ తదుపరి మంత్రాలు చదువుతూ [అలా నటించి] కొంచెం సేపువుండి, గంపపైన కప్పిన వస్త్రమును తొలగించి, గంప లేపి పక్కన పెట్టగానే క్రింద పరచిన వస్త్రంమీద కొన్ని అరటికాయలు కనిపించి,చూచువారికి అద్భుతంగా వుంటుంది.

ఈ ప్రదర్శన ఎక్కువభాగం వాక్ చాతుర్యంమీద, హస్తలాఘవంమీద ఆధారపడి వుంటుంది. ముందుగా కొన్ని అరటి పళ్ళకు సన్నని దారములు [తేలికగా తెగేవి] కట్టి, గంపకు లోపలవుండే అడుగుభాగంలో కట్టి, సిద్ధంగా వుంచుకోవాలి. గంప స్టేజీ మీద వుండునప్పుడు, గంపను తీసుకొని వస్త్రంపైన బోర్లించే సమయంలోనూ గంప లోపలిభాగం ప్రేక్షకులకు ఎట్టి పరిస్థితులలోనూ కనిపించకుండా జాగ్రత్త పడాలి. తరువాత ప్రదర్శన చేసేటప్పుడు- బోర్లించే సమయం లోనో, వస్త్రం కప్పే సమయంలోనో, వస్త్రం తీసే సంద

ర్భంలోనే అరటికాయలకు కట్టిన దారాలను మెళుకువగా త్రెంచివేస్తే...అవి తెగి క్రింద బట్టమీదపడతాయి.ఇంకా తేలికగా ఈ అరటికాయలకు కట్టిన దారాలను త్రెంచవలెనంటే సుమారు పదిఅరటికాయలను కట్టామనుకుంటే- గంపబోర్లించేటప్పుడు 1-2దారాలను, వస్త్రం కప్పేటప్పుడు 1-2 దారాలను ఇలా అంచెలంచెలుగా కూడా త్రెంచుతూ జాగ్రత్తగా ఈ ప్రదర్శన ఇవ్వవచ్చును.

## ఇసుకతో పసందైన హల్వా

తన మహిమతో ఇసుకను హల్వాగా మారుస్తానని చెప్పి,ఒకచిన్న గిన్నెలో ఇసుకనుపోసి,దానినిపరీక్ష నిమిత్తం. తన అసిస్టెంట్ ద్వారా సభికులకు చూపి, వారు దానిని "ఇసుకే" అని చెప్పిన తరువాత తిరిగి గిన్నెతీసుకొని- దానిలో ఉడుకు నీరు పోసి కలియబెట్టగానే అది అద్భుతంగా హల్వాలాగా మారిపోయి, చూచువారికి దిగ్భ్రమ కలుగుతుంది.

ఈ ప్రదర్శన చేసేముందు మూడు వంతులు కండ చక్కెర, బాదంపప్పు [బాదం మసికి] నాలుగున్నర వంతులు కేసరి [కుంకుమపువ్వు] తగినంత [అంటే కండ చక్కెర, బాదం కలిపి కిలో [1000 గ్రా] వుంటే కేసరి 50 గ్రా॥లు వుండాలి] కలిపి, రోటిలోవేసి దంచాలి. ఇలా దంచిన తరువాత ఆ పొడుము అచ్చం ఇసుకలాగా [గోధుమరవ్వలాగా] వుంటుంది. దీనిలో వేడినీరు పోయగానే హల్వా తయారవుతుంది.అయితే ప్రదర్శకుడు రెండూ ఒకే రకం గిన్నెలు తీసు

కొని ఒక గిన్నెలో పైవిధంగా తయారయిన మిశ్రమం, రెండో గిన్నెలో మామూలు ఇసుక పోసి ఉంచాలి. సభికులకు చూపించేటప్పుడు మాత్రం ఇసుక పోసిన గిన్నెను చూపి, వేడినీరు పోసేటప్పుడు (గిన్నెలను ప్రదర్శకుని అసిస్టెంట్ గాని, ప్రదర్శకుడుగాని చాకచక్యముగా మార్చవలసి వుంటుంది) మాత్రం మిశ్రమం పోసిన గిన్నెను వాడాలి.

## వేడినూనెలో ఉడికించినా చచ్చిపోని పిచ్చుక

విచిత్రమైన ఈ ప్రదర్శనకు ముందుగా ప్రదర్శకుడు ఒక ఆరోగ్యకరమైన ఊరపిచ్చుకను పట్టుకొని (దానికి రెక్కలు, ఈకలు అన్నికూడా రాలిపోనివి అయివుండాలి). దానికి కడుపునిండా ఆహారంపెట్టి, నీళ్ళు త్రాగించిన తరువాత 10 నిముషాలు ఆగి, దాని ఒళ్ళంతా వైన్ (సారాయి)లో ముంచి దట్టంగా పట్టించాలి. తదుపరి గోధుమ రొట్టెలు పలుచనివి రెంటిని యారుచేయాలి. ఆ రెండురొట్టెల మధ్య వైన్‌తో తడిపిన పిచ్చుకను పెట్టి జాగ్రత్తగా (కజ్జికాయ మధ్య కొబ్బరి, సెనగపప్పు మొదలగు వాటితో తొక్కిన ముద్దపెట్టి మూసే విధంగా) రొట్టెల చివరలను మడవాలి. వెంటనే అంతకుముందే సిద్ధంగా వుంచుకొన్న పొయ్యిమీద భాండీలో వేడిగా కాగివున్న నూనెలోవేసి, రెండుసార్లు అటూ ఇటూ పొర్లించిన వెంటనే తీసి, త్వరగా ఆ రొట్టెలను విడదీయాలి. అప్పుడు అందులో వున్న పిచ్చుక రొట్టెలు విడదీసిన వెంటనే ఎగిరి పోతుంది. ఈ కార్యక్రమాలన్నీ

రొట్టెల మధ్యన పిచ్చుకను బంధించిన తరువాత ఆలస్యము జరిగితే పిచ్చుక ప్రాణానికి హాని కలుగుతుంది. రొట్టెలు తయారు చేసేటప్పుడే పొయ్యిమీద సన్నని సెగతో నూనె వేడి చేస్తూ వుండాలి. ఇంకొక విషయం రొట్టెలు తయారు చేసిన తరువాత మాత్రమే పిచ్చుకను పైన్‌లో ముంచాలి.

## చీకట్లో భగవాన్

ప్రదర్శకుడు ప్రేక్షకులతో "దేవుడ్ని నేను చూడాలను కుంటే చూడగలను. మీకు చూపాలనుకుంటే చూపగలను. మీకు ఇప్పుడు నా ఇష్టదైవాన్ని చూపుతాను" అని చెప్పి ముందుగా ఏర్పాటు చేసుకొన్న గదిలోకి వారిని తీసుకెళ్ళి తలుపులు, కిటికీలు మూసివేసి కొంచెంసేపు ధ్యానంచేసి తన అసిస్టెంట్‌తో లైట్లన్నీ తీసివేయించగానే గోడమీద ఆశ్చర్య కరంగా భగవంతుడు దర్శనం ఇస్తాడు. మరల లైట్లు వేయ గానే భగవంతుడు అదృశ్యమవుతాడు.

ఈ ప్రదర్శనకు ముందుగా రేడియం ఫిష్ (చీకటిలో మెరిసే చేప) అనే చేపల యొక్క పొట్టు (పొలుసు)ను తెచ్చి (పచ్చిగానే వుండాలి. తడిఆరగూడదు) మెత్తగా నూరుతూ "ఈథర్" అనే ద్రావకాన్ని పోయాలి. ఆ తరువాత దాన్ని మంచి గాజుసీసాలో పోసుకొని భద్రపరచుకోవాలి. సమయం వచ్చినప్పుడు ఈ మిశ్రమ పదార్థంతో మనకు ఇష్టమైన బొమ్మను గోడమీద వేసుకోవాలి. బొమ్మ వేసేటప్పుడు కూడా చీకటిలోనే వేయాలి. లేకపోతే ఈ ద్రవం గోడ మీద

వేసేటప్పుడు ఎక్కడ వేస్తున్నామో వెలుతురు వలన తెలియదు. ముఖ్యంగా గది— పగలు కూడా కిటికీలు, తలుపులు మూసివేస్తే బాగా చీకటిగా వుండే గదై వుండాలి.

## పాము తలమీద కప్ప

ప్రదర్శనకు బజారులో అమ్మే ప్లాస్టిక్ పాము ఒకటి, ప్లాస్టిక్ కప్ప ఒకటి తీసుకోవాలి. పాము తలపై భాగంలో నేర్పుగాకోసి శక్తివంతమైన అయస్కాంతాన్ని అంటించాలి. అలాగే కప్ప అడుగు భాగంలో కూడా మాగ్నెట్ [అయస్కాంతం]ను అంటించాలి. అవి ఆకర్షించుకొనే పరిధిని ముందుగానే పరీక్ష చేసుకొని చూడాలి. అది గుర్తుంచుకొని స్టేజీమీద ఆ పరిధిలోనే వదలాలి. పాము, కప్పకంటే బరువు వుండేదిగా ముందే చూచుకోవాలి. అలా గయితేనే కప్ప వెళ్ళి పాము తలమీద కూర్చోనగలుగుతుంది. రెండూ సమానమయిన బరువయినచో- పాముకిపెట్టిన అయస్కాంతము బరువుగా వుండాలి. లేకపోతే రెండూ కదలి ముందుకు వచ్చిన తరువాత మాత్రమే కప్ప, పాము తలమీద కూర్చుంటుంది. ఈ ప్రదర్శన కొద్ది మార్పులతో కప్పను మింగే పాముగా కూడా మార్చుకోవచ్చును. ఎలాగంటే నోరు పెద్దగా తెరచుకొనివున్న పాము [పాము తోలుతో]ను తయారుచేసుకొని కప్పను పాముకంటే బరువుగా వుండేటట్లు చూసుకొంటే- పామే కప్ప దగ్గరకు ప్రాకుతూ వచ్చి:దాన్ని నోట కరచుకొంటుంది. అయితే కప్పబొమ్మ మాత్రం పాము నోటిలో పట్టేటట్లుగా వుండాలి.

## గాజు పెంకులను నోటితో నమలుట

ప్రదర్శకుడు సభికులతో - నేను గాజు పెంకులను నోటితో నమిలి - పిండి పిండి చేస్తానని చెప్పి తను సిద్ధంగా వుంచుకొన్న గాజు పెంకులను, పరీక్ష నిమిత్తముగా ప్రేక్షకులకు చూపి—వాటిని నోటిలో వేసుకొని, కసా బిసా పిండి పిండిగా నమిలివేయాలి. తరువాత దానిని నోటిలో నుండి బయటకు తీసి ప్రేక్షకులకు చూపవలెను. ఈ విచిత్రమయిన శక్తికి చూచువారు అమితాశ్చర్యాన్ని పొందుటయే గాక- ఆనందపడగలరు.

ఈ ప్రదర్శనకు ముందుగా-అక్కలకర్ర అనే మూలికను దెచ్చి, దాన్ని బాగా మెత్తగా నలగగొట్టి, రసాన్ని పిండి, ఆ రసాన్ని - తాను నమలబోయే గాజు పెంకులకు దట్టముగా పట్టించి, ఆరబెట్టి జాగ్రత్త చేసుకోవాలి. గాజు పెంకులను నమలబోయే ముందు కూడా అక్కలకర్ర వేరును నోటిలో వేసుకొని, బాగా మెత్తగా నమిలి - నోటిలో లోపలి భాగమంతా [నోరంతా] మందంగా పట్టించాలి. ఇలా చేస్తే గాజు పెంకులు నోటిలో వేసుకొని నమిలినా - మన కెలాంటి బాధా వుండదు.

## సన్నమూతిగల సీసాలో కోడిగ్రుడ్లు

ఎంత సన్నటి మూతిగల సీసాలో అయినా కోడిగ్రుడ్డు [ఏ జాతి పక్షి గ్రుడ్డయినా పర్వాలేదు] పట్టువిధానం ఏమిటంటే? ముందుగా కొన్ని గ్రుడ్లు తెచ్చి - ద్రాక్షసారాయి

నందు [సెనగపులుసు అయినా పరవాలేదు] వేసి- పది పదిహేను రోజులు నానబెట్టాలి.అప్పుడు గ్రుడ్డు పై భాగంలో- వుండే పెంకు మెత్తబడి [తోలు గ్రుడ్డులా] పోతుంది. అలా మెత్తబడిన వాటిని దీసి- సీసాలోనికి మెల్లగా నెట్టాలి. ఆ తర్వాత చల్లని నీరు పోసిన వెంటనే మెత్తబడిన గ్రుడ్ల పై పెంకు గట్టిపడిపోతుంది. చూచేవారికి ఆ గ్రుడ్లు సీసా లోకి ఎలా వెళ్ళాయో అర్థంగాక - ఆలోచించినా, ఆ ఆలోచనకు అందక ఆశ్చర్యపోతారు.

## కోడిగ్రుడ్డు భయంకరమైన శబ్దం చేస్తూ నీటిలో ఈదుట

ప్రదర్శకుడు ముందుగా ఒక కోడి గ్రుడ్డును (పక్షిజాతి గ్రుడ్డు ఏదయినా పర్వాలేదు) తీసుకొని చిన్న బెజ్జం వేసి- దానిలోపల వుండే పదార్థం (పచ్చసొన, తెల్లసొన) మొత్తం తీసివేయాలి. తరువాత దాన్ని ఎండలో - తడిలేకుండా బాగా ఆరబెట్టాలి. ఆ తరువాత రాళ్ళ సున్నము, గంధకము తెచ్చి- విడివిడిగా మెత్తని పౌడర్‌లాగా నూరాలి. గంధకము, సున్నములను సమపాళ్ళలో కలిపి, ఆ పౌడర్‌ను - ఎండబెట్టిన అండం బెజ్జంలో నుండిజాగ్రత్తగా గ్రుడ్డు పగలకుండా కూర్చి, తరువాత ఆ బెజ్జాన్ని తెల్లని కాగితంతో కనిపించని విధంగా అంటించాలి. చూచువారికి అనుమానం రాకుండా అంటించిన కాగితం కొసలకు మైనంరాసి నునుపుగా రుద్దాలి. ఆ తరువాత ప్రదర్శన సమయములో ఈ గ్రుడ్డును నీటిలో వేసిన-తుపాకి

గొట్టంనుండి "గుండు" బయటకు వచ్చే శబ్దాన్ని కలిగిస్తూ స్టీమ్‌బోట్ లా నీటిలో ప్రయాణం చేస్తుంది. అద్భుతమయిన ఈ ప్రక్రియ చూపరులకు ఎంతో ఉద్వేగాన్ని, ఉత్సాహాన్ని కలిగించును.

## ప్రయాణించే దివ్య దీపం

ప్రదర్శకుడు ముందుగా టేకు చెక్కతో తయారు చేసిన నునుపయిన (బాగా పాలిష్ చేసినది) పీటగాని, బల్లగాని తీసుకురావాలి. తరువాత మైనం కరగించి- ఆ చెక్క మీద పోసి ఇంకా బాగా నున్నగా వచ్చేటట్లు- పరిశుభ్రంగా తుడవాలి. ఆ చెక్క ఒకవైపు కొంచెం పల్లంగా [చాలా స్వల్పముగా] వుండేటట్లు చేసుకోవాలి. ఆ తరువాత ఒక రాగి నాణెమును పరిశుభ్రంగా (చిలుము లేకుండా) మెరసి పోయేటట్లుగా తోమి వుంచుకోవాలి.

ప్రదర్శన సమయములో సిద్ధంగా వుంచుకొన్న పైన చెప్పిన పీటమీద- (ఎత్తువున్న పైపు) ఈ రాగి నాణాన్ని పెట్టి దానిమీద చిన్న కర్పూరపు గడ్డ పెట్టి వెలిగిస్తే - ఆ రాగి నాణెం ఒకరి ప్రమేయం లేకుండా తనంతట తానే మెల్లగా పల్లంవైపుకు ప్రయాణం చేస్తుంది. ఇది చూచు వారికి- చాలా చిత్రంగా వుంటుంది.

## కర్పూర దీపాల దివ్యసంగమం

ఈ ప్రదర్శన-పైన చెప్పిన [ప్రయాణించే దివ్య దీపం] దానిలో చిన్న మార్పులు చేస్తే సరిపోతుంది. పీటకు

ఆ చివరా, ఈ చివరా [బయట వైపులు] ఎత్తుగా వుంచి పీట మధ్య భాగంలోకి రెండు వైపుల నుండి క్రమేపి ఏటవాలుగా [కనిపించనంత తక్కువగా] వచ్చేటట్లు చేయించుకోవాలి. పైన చెప్పిన విధంగా ఒకటి కాకుండా- రెండు రాగి నాణాలను శుభ్రపరచి- పీటకు ఆ చివరా ఈ చివరా పెట్టి వాటిమీద కర్పూరం వెలిగిస్తే- అటునుండి ఆ దీపం, ఇటు నుండి ఈ దీపం ప్రయాణించి- పీట మధ్యలోకి వచ్చి- ఒకటిగా కలసి [సంగమించి] పోతాయి. ఇది చూడటానికి చాలా ఇంపుగా వుంటుంది.

ఈ విధంగానే నాలుగు దీపాలు సంగమిస్తున్నట్లుగా కూడా చేయవచ్చు. ఆ విధానం ఈ పాటికే మీకు అర్థం అయివుంటుంది కదూ !

## ఆకు దొన్నెలో నీళ్ళు కాచుట

ఒక అరటి [ఏ చెట్టు ఆకు అయినా పరవాలేదు. ఉదా॥ బాదం, తామర, మఱ్ఱి మొ॥నవి] ఆకును తెచ్చి దానికి రెండు వైపులా కప్ప కొవ్వును బాగా పట్టించి ఆరబెట్టి వుంచుకోవాలి. ప్రదర్శించే సమయంలో ప్రేక్షకుల ముందే ఆకును, దొన్నెగా కుట్టాలి. ఆ దొన్నెలో నీరుపోసిన తరువాత దొన్నె పై భాగమంతా "స్పిరిట్"ను బాగా పట్టించి అగ్గిపుల్ల గీయగానే దొన్నె భగ్గున మండిపోతుంది. కాని ఆకుదొన్నె కాలదు. నీరు వేడిగా వుంటుంది.

## నెత్తిమీద పొయ్యి పెట్టి నీరు కాచుట

ఈ ప్రదర్శనను చాలా జాగ్రత్తగా చేయవలెను. ముందుగా తములపాకులు, ఏనుగు మలము(విసర్జనము)రాతి సున్నము కలిపి వాటిని నీరు తగలకుండా మెత్తగా (మైనంలాగా) నూరి వుంచుకోవాలి. తరువాత తలమీద పెట్టే విధంగా ఒక పొయ్యి (సుమారు 5-6 అంగుళాల ప్రమాణంలో) చేయించాలి. పైన చెప్పిన పదార్థముతో మూడు ముద్దలను చేసి పొయ్యికి అడుగుభాగంలో మూడు పక్కలా అంటించాలి. తదుపరి ఆ పొయ్యి ఏనుగు మూత్రముతో బాగా తడిపి,ఆరబెట్టి ఎండించుకోవాలి. ఆ తరువాత సన్నని డబ్బా రేకుతో సన్నగా 'చుట్టు' [కడవలు-కుండలు పెట్టుకొనే కుదురు] చేయించుకొని ఆ రేకుచుట్టు కనపడకుండా గుడ్డలు చుట్టాలి. కుదురుకు గుడ్డలు చుట్టే ముందు కలబంద చెట్టును తొక్కుతీసి, రేకుచుట్టూతా చుట్టటం మరచిపోవద్దు. పైన చెప్పినవన్నీ ముందు సిద్ధము చేసుకొన్న తర్వాతనే ఈ ప్రదర్శన చేయవలెను.

ప్రదర్శకుడు ప్రేక్షకులతో నా మహిమతో నెత్తిమీద పొయ్యి వెలిగించి నూనెనుగాని, నీరుగాని ఏది కావాలంటే దానిని కాచి ఇస్తాను. కాని తలకు ఎలాంటి ప్రమాదము వాటిల్లదని చెప్పి, ప్రేక్షకులలో ఎవరినైనా రమ్మని పిలిచి శిరస్సుపై సిద్ధంగా వుంచుకొన్న కుదురు [చుట్టు]ను వుంచి, దానిమీద పొయ్యి [సిద్ధంగా వుంచుకొన్న]ని పెట్టి- ఆ

హొయ్యిమీద మూకుడుగాని, ఖాండీ (ఇనుపపాత్ర) గాని నూనెపోసి పెట్టాలి. ఆ తరువాత హొయ్యిలో చమురుతో (కిరోసిన్, నువ్వులనూనె, స్పిరిట్ ఏదైనా పరవాలేదు) తడిపిన వత్తులను వేసి, అగ్గిపుల్ల గీసి, ఆ వత్తులను ముట్టించాలి. ఖాండీలోని నూనె ఫెళఫెళ కాగేవరకు మంట పెట్టినా తలపై హొయ్యి పెట్టిన వ్యక్తికి ఎలాంటి ప్రమాదము కలుగదు.

## కొలిమిలో ఎర్రగా కాల్చిన లోహపు వస్తువును నోటితో పట్టిలేపుట

1 కిలో లేక 2 కిలోల లోహపు గుండును (ఇనుము' రాగి, ఇత్తడి- వీటిలో ఎదైనా పరవాలేదు) కొలిమిలో బాగా ఎర్రగా కాల్చి, దానిని బయటికి తీసిన తరువాత నోటితో పట్టుకొని పైకిలేపి. ప్రేక్షకులకు చూపగానే వారు అమిత ఆశ్చర్యాన్ని పొందుతారు.

కాలిన లోహమును నోటితో పైకిలేపే ముందుగా ఇంద్రజాలికుడు హరిత మండూక తైలము (పచ్చ కప్ప క్రొవ్వు)ను రెండు పెదవులకు, నోటిలోని మొత్తంభాగాలకు (నాలుక, పళ్ళు, చిగుళ్ళు మొ॥) దట్టంగా పట్టించాలి. ఆ తరువాత కాలిన వస్తువును పళ్ళతో పట్టుకొని ఎత్తి 1-2 నిమిషాలలోనే వదలివేయాలి. అంతకన్నా ఎక్కువకాలము వేడి వస్తువు నోటిలో వుంటే కప్ప క్రొవ్వు కరిగి, నోరు కాలే ప్రమాదమేర్పడగలదు.

## స్నానం చేస్తే వంటికి విభూతి రేఖలు

గుంటూరుజిల్లాలో ఒక దేవీభక్తురాలిగా చెలామణీ అవుతున్న అమ్మవారు స్నానంచేసి అలాగే తడిబట్టలతో వచ్చి, తన భక్తులకు దర్శనమిస్తుంది. ఆమె శరీరంపై తడిఆరి పోగానే ఆమె వంటినిండా విభూతిరేఖలు ప్రత్యక్షమౌతవి. అక్కడ చేరిన భక్తులంతా ఆమె శక్తికి నిశ్చేష్టితులై కాను కలు సమర్పించి వెళుతుంటారు.

ఈ ప్రదర్శనలో గల అసలు రహస్యం ఏమిటంటే ! స్నానానికి ముందుగానే తుత్తురుబెండసొన లేక అడవి ఆము దపుచెట్టు సొనతో శరీర భాగాలలో రేఖలు తీర్చిదిద్దాలి. ఆరి పోగానే అవి శరీరంపై కనుపించవు. స్నానం చేసిన తరువాత తడి ఆరిపోవటంతో పూర్వం దిద్దిన రేఖలన్నీ తెల్లగా మారిపోయి, చూచేవారికి విభూతి రేఖలవలె కనుపిస్తవి. ఆశ్చర్యంగా వుంటుంది.

## నీళ్ళల్లో మంటలు

"ఫాస్ఫరస్"ను నీళ్ళలో కలిపి వుంచుకోవాలి, అవ సరమయిన సమయంలో - ఆ నీటిని మండించవలననుకొన్న ప్పుడే కొంచెం 'అప్లెయిన్'ను వేసినచో - పొగలు, మంటలు పుట్టి; చూచువారి కమితాశ్చర్యాన్ని కలిగిస్తుంది.

## ఇసుకనూ కసాబిసా నమిలి ఊయుట

ప్రదర్శకుడు ఇసుకను (స్వచ్ఛమైన రాళ్ళు, రప్పలు, మట్టి, గవ్వలులేనిది) పంచదారవలె నములుతానని ప్రేక్ష

కులతో చెప్పి, ఇసుకను గుప్పిడితో నోట్లో వేసుకొని కసా-బిసా నమిలి ఊసినచో - చూచిన వారు చాలా ఆశ్చర్యం పొందుతారు.

ఈ ప్రదర్శనకు ముందుగా చేయవలసినది-గురువింద ఆకులను నోటిలో వుంచుకోవాలి. మాట్లాడునప్పుడు ఆకులను చూచువారికి కనుపించకుండా జాగ్రత్తగా ఉండాలి. ఈ ఆకులు నోటిలో వుంచుకొని ఇసుకను నమిలినచో- ఇసుకకు సహజంగా వుండే గరుకుతనము వుండదు.

## గానుగ (క్రషర్) ఎంత త్రిప్పినను నూనె రాకుండా చేయుట

ఉత్తరేణి సమూలమును (వేరును) దంచి మెత్తగా పొడిచేసి-ఆ పొడిని గానుగ అడుగు భాగములో వేసి, తరువాత గానుగ ఆడించాలి. ఆ తదుపరి గానుగలో - నువ్వులు గాని, వేరుసెనగలు గాని వేసి ఎంత త్రిప్పినా నూనెరాదు. మరలా గానుగలో వేసిన ఉత్తరేణి పొడిని శుభ్రంగా కడిగేంత వరకు నూనెరానేరాదు.

## నీళ్ళలో కలిపిన పసుపును నీటినుండి వేరు చేయుట

ఒక పాత్రలో నీరు తెప్పించి, అందులో పసుపు కలిపి చూపించి - ప్రేక్షకులకు "నా మంత్ర ప్రభావముతో మరలా పసుపును బయటికి తీస్తానని" చెప్పి, విభూతిని మంత్రించి (అట్లు నటించి) ఆ నీటిలో వేయగానే- పసుపు ముద్దగా నీటిలో తేలియాడును.

ఈ ప్రక్రియ చూపుటకు ముందుగా ఇంద్రజాలికుడు "నీరుగొల్చి" అనే చెట్టుయొక్క విత్తనములను తెచ్చి- బాగా ఎండించి, మెత్తగా పొడిగొట్టి, ఆ పొడిని ఈ విబూదిలో కలిపి వుంచుకోవాలి. సమయం వచ్చినపుడు ఈ విబూదిలో పసుపు కలిపిన నీటిలో చల్లిన ఆ నీటినుండి పసుపు (కలిపిన దంతా)- ముద్దగా వచ్చును.

## పాలు కాయకుండానే నిమిషాల్లో పెరుగు తయార్

అరటి చెట్టుకు అడుగున భూమిలో వుండే దుంపనుతీసు కొని, ముక్కలుకోసి, బాగా ఎండబెట్టి, మెత్తగా పౌడర్ చేసి వుంచుకోవాలి. సమయం వచ్చినప్పుడు ఒక గిద్దెడు పాలలో తులం పౌడర్ చల్లినచో ఆ పాలు నిమిషాలలో గడ్డపెరుగుగా మారగలదు.

## ఎంతసేపు వెలిగినా ప్రమిదలో వత్తి కాలకుండా చేయుట

ప్రమిదలో వత్తి చేయుటకు ముందుగా ఆ వత్తిని మనము వరి అన్నము వండినపుడు వచ్చే గంజిలో నాన వేసి తరువాత బాగా ఎండించాలి. ఆ వత్తిని ప్రమిదలో వేసి, నూనె పోసి బాగా తడిపి వెలిగించినచో నూనె ఉన్నంత వరకు వెలుగును. వత్తిమాత్రం అలాగేకాలకుండా వుంటుంది.

## వేపనూనె మంచి నెయ్యిగా తయార్

ముందుగా ప్రదర్శకుడు వేపనూనెలో "సహదేవి" ఆకు [వెన్న ముద్ద ఆకు]ను తెచ్చి పచ్చిదిగానే నూరి; తగు

మాత్రం కలిపి వుంచుకోవాలి. ప్రదర్శనలో ఆ నూనె అంద రకు చూపిన పొయ్యిమీదపెట్టి కాచినచో అచ్చమయిన నెయ్యి లాగా ఘుమఘుమలాడును. దీనిని తినినచో నెయ్యివలె రుచి గలిగి వుండును.

## నూనెతో పాలు తయారు చేయుట

ఇంద్రజాలికుడు ముందుగా ఉత్తరేణి వేరు (సమూలము)ను తెచ్చి- ఎండలో ఎండించిన తరువాత దానిని బూడిద అయ్యేంత వరకు బాగా కాల్చాలి. 100 గ్రాముల బూడిదలో- 200 గ్రాముల నీరుపోసి, మూడురోజులు దానిని కదలకుండా వుంచి. నాలుగోరోజు బాగా కవ్వముతో మజ్జిగలా చిలకాలి. ఆ తరువాత నాలుగు రోజులు కదపకుండా వుంచి దానిపైన తేరుకొని (తెట్టకట్టుకొని) వున్న నవనీతాన్ని జాగ్రత్తగా తీసి, ఎండపెడితే - అతి సున్నితమయిన పౌడర్ తయారవుతుంది. సమయం వచ్చినపుడు ఆ పౌడర్‌ను నూనె (మంచినూనె, నువ్వులనూనె, ఆముదము ఏదైనా పరవాలేదు)లో చిటికెడు వేసి కలియబెడితే-ఆ నూనె పాలు లాగా అవుతాయి.

## అగ్గిపెట్టె లేకుండా ఉఫ్‌మని ఊదితే మండే అగ్గిపుల్లలు

సల్ఫ్యూరిక్ యాసిడ్‌లో అగ్గిపుల్లలను ఒకటికి నాలుగుమార్లు ముంచితీసి ఆరబెట్టాలి. ప్రదర్శన సమయంలో ఈ అగ్గిపుల్లను తీసుకొని ఉఫ్‌మని ఊదితే మండిపోతుంది.

## ఎంతగీసినా మండని అగ్గిపుల్లలు

ప్రదర్శకుడు ముందుగా సోడియం సిలికేట్‌లో అగ్గి పుల్లలను ఒకటికి నాలుగుసార్లు ముంచితీసి, ఆరబెట్టి వుంచుకోవాలి.

ప్రదర్శన సమయంలో ఈ అగ్గిపుల్లలను ఎంత గీచినా మండవు.

## సిగరెట్ అంటించకుండానే పొగలు

ప్రదర్శకుడు ముందుగా ఒక గాజుగ్లాస్‌లో "హైడ్రోక్లోరిక్ యాసిడ్" రెండుచుక్కలు వేసి- ఆ గ్లాస్‌లో అంటించని సిగరెట్ [చుట్ట, బీడి అయినా పరవాలేదు] వేసి గ్లాస్ పైన పెట్టే మూతలో రెండుచుక్కలు "అమ్మోనియం"ను వేసి- గ్లాస్‌పైన బోర్లిస్తే, ఆ చుక్కలు గ్లాస్‌లో వున్న యాసిడ్‌తో సంయోగము చెంది పొగలు వస్తాయి.

ఇది ప్రదర్శించువారు సమయానుకూలముగా మాటలాడుచూ చూచువారికి అనుమానము లేకుండా చాకచక్యంగా మెలగాలి.

## లెక్క చెప్పకుండా శేషసంఖ్యను చెప్పటం

ఈ ప్రదర్శన- చాలా సునాయాసముగా చేయడానికి వీలయినది. ప్రదర్శకుడు ప్రేక్షకులలోనే ఎవరినయినా పిలిచి- అతని కిష్టమయిన సంఖ్యను కోరుకోమని చెప్పాలి.

అతను కోరుకున్న సంఖ్యను రెట్టింపు చేయమనాలి. అలా రెట్టింపు చేసిన సంఖ్యకు మరో పదహారు కలిపి- కూడమనాలి.

అలా కూడగా వచ్చిన సంఖ్యను నాలుగు భాగాలు చేయమనాలి.

భాగించగా వచ్చిన సంఖ్యలో నుండి- మొదట అతను కోరుకున్న సంఖ్యలో సగం తీసివేయాలి.

అతను ఇదంతా చెయ్యటం పూర్తి అయిన తరువాత- ఇప్పుడు మీ దగ్గర మిగిలిన శేషం 4 అని చెప్పాలి. మిగిలిన శేషం ఎటుతిరిగి నాలుగే కాబట్టి-ప్రేక్షకులు అదేదో మన ప్రతిభగా భావించి ఆశ్చర్యపడతారు.

పై విధానమునకు ఉదాహరణ :

| | |
|---|---|
| అతను కోరుకున్న సంఖ్య | 16 |
| దాన్ని రెట్టింపుచేయగా | $16 \times 2 = 32$ |
| మనం కలపమన్నది కలపగా | $32 + 16 = 48$ |
| దాన్ని భాగించగా | $48 \div 4 = 12$ |
| అతను కోరుకున్న సంఖ్యలో సగం తీస్తే | $12 - 8 = 4$ |

అసలు శేషసంఖ్య చూడకుండా,చెప్పగలగటానికికారణం- వారు కోరుకున్న సంఖ్యకు రెట్టింపు చేసిన తరువాత మనం కలపమన్న 16 సంఖ్యలోనే వున్నది.

అదే మనం వారికి 8 కలపమంటే శేషసంఖ్య రెండు అవుతుంది. 32 కలపమంటే 8 అవుతుంది.

ప్రదర్శకుడు సమయానుకూలంగా కలపమనే సంఖ్యలను మారుస్తుంటే ప్రేక్షకులకు అసలు విషయం అర్థంగాక- అదేదో మన మహిమగా భావిస్తారు.

## పీటపై నీళ్ళు కాచుట

ఒక పీటవేసి నిప్పు సహాయం లేకుండా దానిపై గిన్నె పెట్టి, గిన్నెలో నీరుపోసి వేడిచేసి, చూపించగలనని ప్రేక్షకులకు చెప్పాలి. తరువాత ఒక చిన్న జర్మన్ సిల్వర్ గిన్నెను దెచ్చి [క్రొత్తది] ఆ పీటమీద పెట్టాలి. ఆ తదుపరి దానిలో కొంచెం వెలితిగా నీరుపోసి అందులో పాదరసం, మైలుతుత్తం సమభాగాలుగా వెయ్యాలి. కొద్దిసేపు ప్రేక్షకుల్ని-మాటల ద్వారా ఆనందపరుస్తూ గడిపితే, సుమారు పది పది హేను నిమిషాలలో ఆ నీరు సల సల కాగి ఆవిరి వస్తుంది. గిన్నెకూడా - వెచ్చపడుతుంది. అది చూచిన ప్రేక్షకులు ఆశ్చర్యానందంతో మునిగిపోతారు,

ప్రదర్శకుడు ముందుగా గిన్నెలోపోసేనీటిలో అంతకు ముందే- పాదరసం, మైలుతుత్తం భాగాలకు సమానముగా-ఉప్పు కలిపి వుంచుకోవాలి.

[ఇది రసవాదంలో - పాదరసాన్ని బంధించడాని కుపయోగించే ప్రక్రియ.]

## క్షణంలో చెరువులో తామరపూలు

తామర గింజలను మంచివిగా ఏరితెచ్చి, వాటిని ఊడుగ గింజల నూనెలో పది- పన్నెండురోజుల వరకు నాన బెట్టిన తరువాత ఎండించి భద్రపరచాలి. వినోదం చూపదలచి నప్పుడు-అంతకుముందు తామర తీగెలు లేని చెరువులో ఈ

విత్తులు చల్లిన యెడల 5 నిమిషాలలో తామర తీగెలు, పూలు కూడా ఆ చెరువునందు సాక్షాత్కరించి ప్రేక్షకులను విస్మయ సంభ్రమాలలో ముంచివేయగలవు.

## పది నిమిషాల్లో మామిడిచెట్లు పుట్టుట

బాగా పండి రాలిన మామిడి పండ్ల నుండి. ఎంగిలి తగలకుండా టెంకెలను తీసి, వాటికి సన్నని రంధ్రములు వేసి, ఊడుగ నూనెలో పది రోజుల వరకు నానబెట్టి వుంచాలి. ఆ తరువాత వాటిని దీసి, యెండించి, భద్రపరచి వుంచుకోవాలి. ప్రదర్శన సమయంలో ఒకచోట మెత్తనిమట్టి కుప్పగాపోసి, ఒక మామిడి టెంకెను అందు బెట్టి, మట్టిబాగా తడిసేవిధంగా నీళ్ళు చల్లిన యెడల పది నిమిషాలలో మామిడిచెట్టు పూత, పిందెలతో సహా మొలుచుకు వస్తుంది. ఈ వినోదం తిలకించిన ప్రేక్షకులు ఆనంద పారవశ్యంలో మునిగి. హర్ష ధ్వానాలు గావించగలరు.



* (పై ప్రదర్శనవలెనే దానికి ముందు, దానికి తరువాత కూడా కొన్ని సందర్భాలలో ఊడుగ విత్తుల తైలముతో చేయవలసిన ప్రక్రియలున్నవి. ఇంద్రజాల ప్రదర్శకులకు ప్రాణప్రదమయిన ఈ నూనెను తయారుచేయు విధానము లను-మాచే ప్రచురించబడిన "ఇంద్రజాల రహస్యాలు" అను గ్రంథమునందు చూడగలరు. వెల రు. 6/-

## క్షణంలో చెట్లు మొలకెత్తుట

ఏ చెట్టుయొక్క విత్తులనైనా సరే- ముందుగా ఊడుగగింజల నూనెలో కొన్ని రోజులు బాగా నానబెట్టిన తరువాత ఎండించి, భద్రపరచి వుంచుకోవాలి. ప్రదర్శన వేళలో ఏ చెట్టును మొలిపించదలచిన దాని విత్తులను మెత్తటి మట్టిలో వేడి నీళ్ళు చల్లిన యెడల కొద్ది నిమిషాలలోనే ఆ చెట్టు మొలకెత్తి ఏపుగా పెరిగి ప్రేక్షకులను ఆశ్చర్య చకితుల్ని గావిస్తుండగలదు.

## పిండి బొమ్మ కదుల్తుంది

మంత్రగాళ్ళ టక్కరి మాయాజాలంలో ఇది ఒక భాగం. పిండితో బొమ్మనుచేసి దానికి పసుపు - కుంకుమతో అలంకారాలు చేసి- ఒక పల్చటి ఇనుప పాత్రలో పెట్టి వుంచాలి. కొంచెంసేపు (దొంగ) జపం చేసినట్టునటించి, అర చేతిని దానికి కొంచెం సమీపంలో వుంచి- "కదులు! రావే!" అంటూ చేతిని తనవైపునకు నెమ్మదిగా లాగుతూవుంటే ఆ బొమ్మకూడా పాత్రతోసహా ముందుకు నడిచివస్తుంది. అసలు కారణమేమిటంటే అధికశక్తిగల అయస్కాంతపు ఉంగరాలు ప్రదర్శకుడి చేతి వ్రేళ్ళకు వుండి, అవి బొమ్మగల ఇనుప పాత్రను ఆకర్షించటంవల్ల అలా జరుగుతుంది. కానీ చూచే వారికి విషయం తెలీక నిజంగా మంత్రంతో బొమ్మ కదిలిందని భావించి, దిగ్భ్రాంతి చెందుతారు.

## శంఖంలో ఓంకార శబ్దం

సముద్రంలో దొరికే శంఖాలు వివిధ రూపాలలో లభిస్తుంటవి. దానిలో వుండే పురుగుయొక్క శరీర నిర్మాణాన్ననుసరించి శంఖంరూపురేఖలు మారుతుండగనవు. కొందరు అవివేకులు కొన్ని శంఖాలలో ఓం అనే శబ్దం వినవస్తుందని, అది ఉత్తమమైనదిగా భావించి ఎక్కువ ఖరీదుకు కొనుగోలు చేసి దాన్ని పూజ్యభావంతో చూస్తుంటారు.

ఏ శంఖానికైనా గర్భానికి సంబంధం కలిగేటట్లుగా రెండు మూడు అతిసన్నని రంధ్రాల నేర్పరచి ఆ శంఖాన్ని గాలి వాటంలో చెవి దగ్గర పెట్టుకుంటే రంధ్రాల ద్వారా లోపలికి ప్రవేశించిన గాలి ప్రతిధ్వనించి, ఒక విధమైన శబ్దం చెవులకు సోకుతుంది. దాన్నే ప్రణవనాదం అని నమ్ముతుంటారు తెలివివాళ్ళు. వీరి బలహీనతను గుర్తించి కొందరు శంఖాల వ్యాపారంలో అధిక లాభాలార్జిస్తున్నారు.

## కొబ్బరికాయం కొడితే పరిమళాలు

బాబాలు మంత్రించి ప్రసాదంగా ఇచ్చిన కొబ్బరి కాయను ఇంటికి తీసుకువచ్చి పగలగొడితే పరిమళగంధాలు ఇల్లంతా వ్యాపించటం; ఇంకేముంది బాబాగారి మహాత్మ్యానికి ఇంటిలోని వారేగాక ఇరుగు పొరుగు వారు కూడా దాసోహమనటం నేటి రోజులలో పరిపాటి అయిపోయింది. ఇంద్రజాలం ప్రదర్శించే వారు కూడా ఈ ప్రయోగం చేసి చూపవచ్చు.

పీచు తీసిన కొబ్బరికాయకు పైన మూడు రంధ్రాలు పెంకుతో కప్పబడి వుంటవి. వాటిపైన పీచు మాత్రం తియ్యరు (అది దేవ రహస్యం). ఆ మూడు రంధ్రాలలోను ఏదో ఒక రంధ్రంపైన గల పొర అతి సూక్ష్మంగా వుంటుంది. దాన్ని కనిపెట్టి, సిరంజీ ద్వారా ఏ విలువైన సెంటునో దాని లోపలికి పంపించి వుంచాలి, పైన గల పీచుమాత్రం పోతూ డదు. ఆ తరువాత ప్రేక్షకుల్ని ఒక పీచుగల కొబ్బరికాయను తెమ్మని చెప్పి, దాన్ని ప్రదర్శకుడు కొంచెంసేపు మంత్రించి నట్లుగా నటించి, వారికిచ్చి కొట్టమనాలి. అప్పుడక్కడే వున్న ప్రదర్శకుడి అసిస్టెంట్ - పీచు తీసి ఇవ్వగలనని చెప్పి, వారి వద్దగల కాయను తీసుకొని, పీచు(లాగుచున్నట్లుగా నటించి) లాగివేసి, కాయ ఇవ్వవలసి వచ్చినప్పుడు మాత్రం అంతకు పూర్వం సిద్ధంచేసి వుంచిన కాయను ఇస్తాడు. ఈలోగా ప్రేక్షకుల దృష్టిని తన మాటల ద్వారా ప్రదర్శకుడు మరల్చ వలసి ఉంటుంది. ఇదంతా చెకచెకా క్షణాలమీద జరిగిపోతుంది మాటలు వినే ధ్యాసలో అసిస్టెంట్ ఇచ్చిన కొబ్బరికాయ తమదని భ్రాంతినందిన ప్రేక్షకులు- ఆ కాయ పగలకొట్టి, అందలి సువాసనలకు, సుగంధాలకు ఉబ్బితబ్బిబ్బు కాగలరు. మిగిలిన ప్రేక్షకులంతా ప్రదర్శకుని వేనోళ్ళ కొనియాడ కుండా వుండలేరు.

# రుద్రాక్షలపై బొమ్మలు

రుద్రాక్షలనేవి ఒక చెట్టుకు కాచే కాయలు. వీటిని హిందువులంతా పరమ పవిత్రంగా భావిస్తుంటారు. వీటిలో ఏర్పడిన పలకలను బట్టి ఏకముఖి, ద్విముఖి, త్రిముఖి, పంచముఖి అని విభజించి, వాటి వాటికి అనేక విశేషాలు కూడా చెబుతుంటారు. ఎవరి నమ్మకం వారిది! కాని ఈ బలహీనతను ఆసరాగా చేసుకొని కొందరు రుద్రాక్షల వంటి కొన్ని కాయలకు కృత్రిమమైన పలకలు సృష్టించి, సొమ్ముచేసుకొంటున్నారు.

ఈ రుద్రాక్షల్లో ఏకముఖి (ఒకే పలక గలది) చాలా విశేషమైనది. ఈ మధ్య ఇటువంటి రుద్రాక్షలు కోకొల్లలుగా వస్తున్నవి. విశేషమేమంటే? వాటిపైన శివలింగం, పాము, త్రిశూలం లాంటి బొమ్మలు కూడా వుంటున్నవి. ఇలాంటి రుద్రాక్షలు ఈ మధ్య కాలంలో తప్ప పూర్వం వున్నట్లుగా ఆధారాలు లేవు. బాగా లావుగా వుండే అడవిరేగు గింజలను సంపాదించాలి. వాటిని నీటియందు రెండు రోజులు నానబెట్టిన తరువాత బాగా ఉడికించి [ఉడికే సమయంలో కొంచెం రెడ్ కలర్ కలపాలి]. వాటిని తీసి-తమకే విధమైన బొమ్మలు కావాలో ఆ విధమైన 'డై'ని తయారుచేయించి, వీటిలో ఆ గింజలు పెట్టి ప్రెస్ చేసినతరువాత వాటిని ఎండబెట్టాలి. అప్పుడివి రుద్రాక్షలవలె యెర్రగా వుండటమేగాక 'డై' ప్రభావం వల్ల గుబ్బలు, పలకలు, బొమ్మకూడా కలిగి వుంటవి.

రుద్రాక్షకాయలు బాగా లావుగా వున్న వాటిని. పండిన తరువాత తీసుకువచ్చి, వాటిపైన వున్న పలకలు, గుబ్బలు చెక్కివేసి, మనకు కావలసిన పలకలు, గుబ్బలు గల 'డై'లో బెట్టి ప్రెస్ చేసిన తరువాత దానిని యెండబెట్టిన. అదికూడా కావలసిన రీతిలో కనుపిస్తుంది.

## భూమిలో నుంచి దైవ విగ్రహం పుడుతుంది

ఈ ప్రదర్శనకు నల్లరేగడ భూములు చాలా అనుకూలంగా వుంటవి. లేక మెత్తటి మట్టి గల ప్రదేశాలు కూడా అనుకూలమే! భూమిని గజమున్నరలోతు, గజంవెడల్పువుండే ట్లుగా త్రవ్వాలి. ఆ తరువాత ఒకరోజు.నానబెట్టిన సెనగలు ఆ గుంటలో అర్ధ గజం వరకు పోసి, ఒక పాతిక గజంమట్టి పోసిన తరువాత ఏదో ఒక దైవ విగ్రహాన్ని దానిలోబెట్టాలి. ఆ తరువాత మట్టిచే ఆ గోతిని పూడ్చి నేలచదును చేసిరావాలి. ప్రతి దినం ఆ ప్రదేశంలో బాగా నీళ్ళుపోస్తుంటే ఏదో ఒక రోజు దైవ విగ్రహం భూమిని చీల్చుకొని బైటికి వస్తుంది. ప్రచారం సాగిస్తే ప్రజావెల్లువ ప్రవాహంలాగా వచ్చి కానుకలు, మ్రొక్కులు సమర్పించిపోతుంటారు. ఇలా జీవించే వారిచే సృష్టించబడిన, "స్వయంభూదైవక్షేత్రాలు"గా ప్రసిద్ధి వహించినవి చాలా వున్నవి మనదేశంలో.

## కర్పూరం అదే వెలుగుతుంది

పల్చటి తెలుపు గుడ్డ పీలికను తడిపి, దానిలో చిన్న భాస్వరం ముక్కను చుట్టి, కర్పూరంవెలిగించే గుంటలోబెట్టి

వుంచాలి. ఆ గుడ్డపీలిక తడి ఆరిపోతున్న తరుణంలో అందరూ చూసే విధంగా హారతి పాత్రను పైకెత్తి పట్టుకొని ప్రేక్షకులందచేసిన కర్పూరం గడ్డను దానిలో వేసి, కళ్ళు మూసుకొని జపం నటిస్తుంటే- భాస్వరం మండి కర్పూరం వెలుగుతుంది. అందరూ ఈ వినోదాని కమితాశ్చర్యం పెందగలరు.

## ఉత్త కాగితంలో కొత్తపువ్వు

ప్రదర్శకుడు ఒక తేలికైన పుష్పాన్ని తన చేతి వ్రేళ్ళసందులలో - వెనుకప్రక్క కుండునట్టుగా నొక్కిపట్టి వుంచి - ముందు ప్రక్క ఒక కాగితాన్ని వ్రేళ్ళపై వుండు నట్టు బొటనవ్రేలితో పట్టుకొని ప్రేక్షకులకు చూపించి, ఆ కాగితంలో పుష్పాన్ని రప్పిస్తానని చెప్పి-తన చేతితో సహా ఆ కాగితాన్ని ఎడమ అరచేతిలో పెట్టుకొని కొంచెం సేపు ఏదో మంత్రించినట్లు నటిస్తూ పుష్పానికి పట్టు తప్పించి కాగితాన్ని పొట్లం కట్టి-ప్రేక్షకుల కిచ్చి విప్పిచూడమనాలి. వారా పొట్లాం విప్పి అందున్న పుష్పాన్ని చూచి ఆశ్చర్యా నందాలు పొందెదరు.

## పంచదార లేకుండా తియ్యటి 'టీ'

ప్రేక్షకులలో ఒకరిని వచ్చి స్టౌ మీద టీ పెట్టమని చెప్పాలి. వారికి పాలు, టీపొడి మాత్రమే ఇచ్చి అవి మరిగిన తరువాత ఒడపోయ్యటానికి తెల్లని పరిశుభ్రమైన గుడ్డనొక దాని నందించాలి. ఆ టీని త్రాగితే తియ్యగా నుంటవి.

పంచదార లేకుండా టీ తియ్యగా వుండేసరికి ప్రేక్షకులు ఆనందదానుభూతి నందగలరు.

దీనికి ముందుగా ప్రదర్శకుడు తెల్లనిది పల్చగా నున్న ఒక నలుచదరపు గుడ్డను-చాక్రిన్ చిక్కగా కలిపిన నీళ్ళలో నానించి, పిండకుండా ఆరవేసి వుంచాలి. ఆ గుడ్డనే వడపోతకు ఇస్తే ప్రదర్శన రక్తికడుతుంది.

## కోడి గ్రుడ్డును వెండిగా మార్చుట ?

ప్రదర్శకుడు ముందుగా ఒక గ్రుడ్డుకు దీపపుమసిని దట్టంగా పట్టించి వుంచుకోవాలి. మసి పట్టించని ఒక గ్రుడ్డును ప్రేక్షకులకు చూపి—"నా మహిమతో దీన్ని వెండి గ్రుడ్డుగా మారుస్తానని" చెప్పి—పరీక్ష నిమిత్తం ఈ మామూలు గ్రుడ్డును ప్రేక్షకుల దగ్గరకు తన అసిస్టెంట్ ద్వారా పంపాలి. తిరిగి తీసుకొచ్చే సమయంలో చాకచక్యంగా ఆ గ్రుడ్డును మార్చి మసిపట్టిన గ్రుడ్డును ప్రదర్శకుడికి ఇవ్వాలి. ఆ గ్రుడ్డును ప్రదర్శకుడు గాజుగ్లాసులోని నీటిలో వేయగానే అది వెండిలా ధగధగా మెరసిపోతుంది.

## ఒకేజాతి పువ్వుకు రెండు రంగులు

ప్రదర్శకుడు ముందుగా పూలచెట్టు నుండి కాండంతో సహా పువ్వును కోసి- ఆ పువ్వుయొక్క కాండాన్ని జాగ్రత్తగా మధ్యకు చీల్చాలి. అలా చీల్చిన కాండాలను రెండు వేర్వేరు రంగులు కలిపిన నీటి గ్లాసులలో వేయాలి. ఆ కాండాలు గ్లాసుల నుండి రంగునీరు పీల్చుకొని గంటా- రెండు

గంటలలో పూవు యొక్క సహజమైన రంగును కోల్పోయి, గ్లాస్‌లలోని రంగులోకి మారిపోతుంది. ఈ పూవు సగం ఒక గ్లాసులోని ఒకరంగులోకి, మిగిలిన మరో సగం మరొక గ్లాసులోని మరో రంగులోకి మారుతుంది.

ఈ ప్రదర్శన చేయువారు సమయానుకూలంగా మాటలు చెపుతూ - తన మహిమ అనో, మరోటనో చెప్పి చేయవచ్చును.

## పటికబెల్లం ముక్కను దీపంలా వెలిగించుట

ప్రదర్శకుడు ఒక పటికబెల్లం (పంచదార గడ్డ ముక్కను ప్రేక్షకులకు చూపి- నా మంత్ర మహిమతో దీన్ని మండిస్తానని చెప్పి, అగ్గిపుల్ల గీసి అంటించగానే అది అంటుకొని దీపంలా వెలుగుతుంది. ఇది చూచినవారు మీ శక్తికి ఎంతో ఆశ్చర్యపోతారు.

ఇది ప్రదర్శించువారు ముందుగా పటిక బెల్లపు ముక్కకు ఒకవైపు సిగరెట్ నుసిని పట్టించి వుంచుకోవాలి. అలా నుసి పట్టించనిచో పంచదార గడ్డ ఎంత ప్రయత్నించినా మండదు. అగ్గిపుల్ల మంటను నుసి రాసిన చోటనే అంటించటం మరచిపోరాదు.

## గ్రుడ్డును మ్రింగివేసే సీసా

ప్రదర్శకుడు ఒక గ్రుడ్డును ఉడికించి, దానిపైనవుండే పెంకును తీసి, శుభ్రం చేసుకొని వుంచాలి. తరువాత ఒక మిల్క్ సీసాను ప్రేక్షకులకు చూపి- నా మంత్ర మహిమతో

ఈ గ్రుడ్డును సీసా మ్రింగుతుందని చెప్పి—ఒక కర్పూరపు బిళ్ళను వెలిగించి, వెంటనే ఆ సీసాలో వేసి-ఆ సీసామూతిలో ఉడికించిన గ్రుడ్డును వుంచాలి. అప్పుడు ఆ గ్రుడ్డును సీసా-లోనికి లాగివేస్తుంది. ఇది చూచినవారికి ఎంతో అద్భుతంగా వుంటుంది.

ఈ ప్రదర్శనకు అసలు కీలకమంతా సీసాలో వేసిన మండే కర్పూరపు బిళ్ళలోనే వుంది. అలా సీసాలో కర్పూరపుబిళ్ళే కాకుండా, మండేకాగితంవేసినా ఇలాగే జరుగుతుంది.

## నాట్యం చేసే నాణెం

ఈ ప్రదర్శనకు ముందుగా అప్పుడే త్రాగిన లిమ్కా-సీసాగానీ, ఆరంజ్ జ్యూస్ సీసాగానీ తీసుకొని దానిమీద అర్ధరూపాయి నాణేన్ని పెట్టి- రెండు చేతులతో సీసాను పట్టుకొని- మంత్రాలు చదవటం (అలా నటించడం) ప్రారంభించిన అర నిమిషానికి సీసా పైన వున్న నాణెం ఎగరటం ప్రారంభిస్తుంది. దాన్ని చేతులలో నుండి తీసి టేబుల్ మీద పెట్టినను- అలా ఎగురుతూనే వుంటుంది. మీ అపూర్వమయిన మంత్ర మహిమను చూచి- ప్రేక్షకులు ఎంతో ఉద్వేగం చెందుతారు.

దీనికి ప్రదర్శకుడు పెద్దగా కష్టపడవలసిన పనిలేదు. సీసామీద నాణెమును పెట్టునప్పుడు గాలి చొరని విధంగా అనగా సీసా అంచులమీద తడికొంచెం ఎక్కువ ఉండేలా చూసి పెట్టాలి. ఇక నాణెం ఎగరటానికి మీరు చేసే ముఖ్య

మైన పని- సీసాను గట్టిగా పట్టుకోవడమే ! అలా మీరు సీసాని గట్టిగా పట్టుకొన్నప్పుడు మీలోని వేడి- సీసా చల్ల దనాన్ని వేడిచేసి, సీసాలోని గాలిని వ్యాకోచింపజేస్తుంది. అలా వ్యాకోచించిన గాలి బయటకు పోయే సమయంలో నాణెమును పయికి లేపుతుంది. ఇది చాలా మందికి తెలి యని విచిత్రం !

## నీటిపై తేలుతున్న సూది

మీ మిత్రులతో సరదాగా పందెంకట్టి విజయం సాధించడానికి చాలా తేలికైన తమాషా ఇది.

ఒక గాజు గ్లాస్‌లో నిండా నీరు పోసి, ఒక సూదిని మీ మిత్రుల కిచ్చి, దీనిని నీటిపై తేలేలా చేయమనండి. ఎన్నిసార్లు సూదిని నీటిలో వేసినా అది మునిగిపోతుంది. వారివల్ల కాక, మిమ్మల్ని చేయమని పందెం వేస్తారు. మీరు చాలా సులభంగా చేసి వారి మన్ననలను పొందగలుగుతారు.

పల్చటి చిన్న ఉల్లిపొర కాగితాన్ని (కొన్ని సిగరెట్ ప్యాకెట్లలో తగరానికి వెనుకభాగాన వుంటుంది) తీసికొని నీటిపై వేయండి! అది తేలుతుంది. దానిపై సూదిని వుంచండి. కాగితంతో పాటు సూదికూడా తేలుతుంది. అయితే దానికి మీ మిత్రులు ఒప్పుకోరు. కాగితం వుండకూడదంటారు. వెంటనే మరో సూదిని తీసికొని, ఆ కాగితాన్ని నిదానంగా నీటిలో ముంచి- బయటకు తీయండి! కాగితం బయటకు వచ్చినా సూది మాత్రం తేలుతూ వుంటుంది. అప్పుడు

అందరూ ఒప్పుకుంటారు. దీనిని చాటుగా చేసి ఒకేసారి నీటిపై తేలుతున్న సూదిని చూపిస్తే మరింత సరదాగా వుంటుంది.

## మీ ఆజ్ఞ ప్రకారం నడిచే గుండీ

ఒక గ్లాస్‌లో సోడాలోని నీరు పోయవలెను. ఆ నీటిలో ఒక చొక్కా గుండీని వేసినప్పుడు- అది పూర్తిగా మునిగి పోతుంది. దానిని అందరికీ చూపించి-మునిగిపోయినగుండీని అందరిముందు "పైకి రా!" అని ఆజ్ఞాపించండి. అది వెంటనే మీ ఆజ్ఞ ప్రకారం పైకి వస్తుంది. అందరూ చూపిన తరువాత "క్రిందికిపో!" అని మరల ఆజ్ఞాపించండి. మీరు చెప్పిన ప్రకారం క్రిందకి పోతుంది. అలా మీరు చెప్పినట్లు చేస్తున్న గుండీని చూచి, అందరూ మిమ్మల్ని మెచ్చుకుంటారు.

ఇందులో గొప్ప విశేషం ఏమీలేదు. సోడా నీటిలో కార్బన్-డై-ఆక్సైడ్ వుంటుంది. గుండీ నీటిలో వేయగానే సహజంగా అది నీటిలో మునిగిపోతుంది. కొంతసేపటికి గుండీ చుట్టూ కార్బన్-డై-ఆక్సైడ్ బుడగలు చేరి దానిని పైకి లేపుతాయి. అది పూర్తిగా పైకి వచ్చాక- బుడగలు పోతాయి. గుండీ; దాని సహజ పద్ధతిలో క్రిందకి దిగుతుంది. మీరు చేయవలసిందల్లా ఈ చర్యలు జరగటానికి ఒక దానికి ఒక దానికి మధ్య ఎంతసేపు పడుతుందో గమనించి- ఆ లెక్క ప్రకారం మీరు గుండీని ఆజ్ఞాపించాలి, చూసేవారికి- మీరు చెప్పినట్లు గుండీ చేస్తున్నట్లుగా వుంటుంది.

## చేతి వ్రేళ్ళకు తడి అంటకుండా నీటిలో నుండి నాణెం తీయుట

ఒక పళ్ళెంలో గ్లాసుడు నీరు పోసి అంచులకు దగ్గరగా నీటిలో ఒక నాణేన్ని వేసి, ఆ నాణేన్ని నీరు అంటకుండా, నీరు పోకుండా బయటకు తీయాలని మీ మిత్రులను అడగండి! వారికి ఎంత ఆలోచించినా ఎలా తీయాలో తెలియదు. వారు తీయలేమనీ ఒప్పుకున్న తరువాత మీరు తీసి చూపించండి.

ఒక గ్లాస్ తీసుకొని అందులో ఒక కాగితం ముక్కకు నిప్పంటించి, మండుతున్న కాగితాన్ని గ్లాస్‌లో వేసి, ఆ గ్లాస్‌ను పళ్ళెం మధ్యలో బోర్లించండి; అప్పుడు విచిత్రంగా పళ్ళెంలో వున్న నీరు గ్లాస్‌లోకి వస్తుంది. నాణెం వున్న చోట నీరు లేకుండా పొడిగా వుంటుంది. అప్పుడు మీరు సులభంగా ఆ నాణెమును తీసి అందరికీ చూపండి.

గ్లాస్‌లో మండుతున్న కాగితం వేసినప్పుడు గ్లాస్‌లోని గాలి వేడెక్కి బయటకుపోయి, గ్లాస్‌లో శూన్యంప్రదేశం ఏర్పడుతుంది. నీటిలో బోర్లించగానే. నీటిపై వున్న గాలి ఒత్తిడికి-నీరు గ్లాస్‌లోని శూన్య ప్రదేశంలోకి చేరుతుంది. దానితో నాణెం వున్న ప్రదేశంలో నీరు వుండదు.

## రాకాసి గ్లాసు

ఒక వైన్ గ్లాస్‌తో నిండుగా నీరుపోసి, కొన్ని గుండు సూదులను తీసికొని- మీ మిత్రులతో నీరు కిందపడకుండా

ఎన్ని గుండుసూదులు వేయగలరని అడగండి! రెండు మూడు అని సమాధానం చెపుతారు. మీరు అంతకంటే ఎక్కువ వేస్తానని చెప్పండి! వారు ఎన్ని చెప్పినా అంత కంటే ఎక్కువ వేస్తానని ధైర్యంగా చెప్పవచ్చు! ఎందుకంటే మీరు వంద గుండు సూదులు వేసినా నీరు క్రిందపడదు. గ్లాస్ రాకాసిలా గుండుసూదుల్ని మింగుతుందేగాని నీటిని కిందపడనీయదు! అయితే గుండుసూదుల్ని నీటిలోకి వదితే టప్పుడు- తలభాగాన్ని పైకివుంచి, మొనభాగాన్ని క్రిందకు వుంచి, చాలా నిదానంగా నీటిలోకి వదలాలి. అలా వందకు పైన గుండు సూదులను వేసినా నీరు క్రిందపడదు. గ్లాస్ మూతి ఎంత వెడల్పు వుంటే అంత మంచిది.

## దివ్య దృష్టి

పదిమంది స్నేహితులతో సరదాగా గడిపేటప్పుడు ఈ తమాషాచేసి అందరిని ఆశ్చర్యపరచవచ్చు. ఈ తమాషాను ఏ సమయంలోనైనా చేయవచ్చు. ఎందుకంటే దీనికి ప్రత్యేకమైన పరికరములు ఏమీ అవసరంలేదు.

మీ స్నేహితులు పదిమందికి ఒకే సైజు తెల్లకాగితములు ఇచ్చి, పరిశీలించమని చెప్పి, వాటిని తిరిగి తీసికొని వారిని ఒక్కొక్కరిచే-వారికి ఇష్టమైన పేరు ఏదైనా సరే చెప్ప మనండి! ఒకరు ఒక పేరు చెప్పగానే-ఒక తెల్ల కాగితంపై దానిని వ్రాసి మడతవేసి - ఒక టోపిలోగాని, డబ్బాలోగాని వేయుండి! అలాగే మిగిలిన మిత్రులు చెప్పినవిగూడా, తెల్ల

కాగితంపై వ్రాసి, మడతలు వేసి, మొదటి కాగితం వేసిన దానిలోనే వేయండి. ఇప్పుడు మీరు మరో కాగితం తీసుకుని- ఒక పేరు వ్రాసి, మడతపెట్టి, మీ వద్ద వుంచుకొని- మీ స్నేహితులలో ఒకరిని వ్రాసిన పది కాగితాలలో ఒక దానిని తీసి అందులో ఏమి పేరు వుందో చూడమనండి; చూసినతరువాత- దివ్యదృష్టితో ఆ పేరు నాకు తెలిసిందని, దానిని నా వద్ద కాగితంలో వ్రాసానని చెప్పి- మీ చేతిలో కాగితం మీ మిత్రులకు ఇవ్వండి! ఆ పేరును చదివి వారు ఆశ్చర్యపోతారు. ఎందుకంటే ఆ రెండుచీటీలలో పేరు ఒక్కటేకాబట్టి.

ఇందులో మాయా-మంత్రం ఏమీలేదు. మీ మిత్రులు పేర్లు చెప్పేటప్పుడు పది రకాల పేర్లు చెప్పినప్పటికీ- మీరు మాత్రం వ్రాసేటప్పుడు- అందులో ఏదో ఒక పేరు మాత్రమే అన్నింటిలోను వ్రాస్తారు ! ఆ పేరునే మీ వద్ద వున్న కాగితంలో కూడా వ్రాస్తారు! మీ మిత్రుడు ఏ కాగితం తీసినా మీవద్ద వున్న కాగితంలో పేరే వస్తుంది !

---

# మహేంద్రజాలం

"ఉషాపద్మశ్రీ"

( శ్రీ విద్యా జ్యోతిష కేంద్రమ్ )

D. No. 22-7-10, స్టేట్ బ్యాంక్ రోడ్,

తెనాలి - 522 201.







## జనప్రియ పబ్లికేషన్స్

అగ్నికులక్షత్రియులవారివీధి-II, గంగానమ్మపేట, తెనాలి-1.